Sharaab & Nashaabandi Aur Islam
(Telugu)

# ఇస్లాం దృష్టిలో
# మద్యనిషేధం

*మూలం:*

**మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై)**
**మౌలానా అబుల్ లైస్ ఇస్లాహి (రహ్మాలై)**

*అనువాదం:*

**అబ్దుల్ వాహెద్**

# ముందుమాట

మద్యపానం, బుద్ధిమాంద్యానికి తొలిమెట్టని తెలియనివారెవరూ లేరు. మన రాష్ట్రంలో మద్యపానాన్ని నిషేధించాలని మహిళామణులు ఉద్యమించి పాలకుల్ని, పాలకులు కాగోరేవారిని దాని విషయంలో బహిరంగ ప్రకటనలు చేసేంతవరకు విడువలేదు. చట్టం సహాయంతో మద్యాన్ని నిషేధించినప్పటికీ ఆ దురలవాటు మనుషుల్లో నుంచి పోవాలంటే సహేతుకమైన కారణాలు కావాలి. మద్యాన్ని వదలివేసేందుకు బలవత్తర ప్రేరక శక్తి కావాలి. దాని చెడుగులను గురించి ప్రజలకు అర్థమయ్యేలా, నమ్మకం కుదిరేలా చెప్పాలి. దానివల్ల కలిగే కీడులు ప్రజల హృదయాల్లో నాటుకోవాలి. దానిగ్గాను అన్ని కోణాల నుంచి పరిశీలనలు జరపడం, వాటి ఫలితాలను ప్రజల వద్దకు తీసుకుపోవడం, వాటిని గురించి ప్రజలకు బోధించడం ఎంతైనా అవసరం. ఆ కృషిలో భాగంగానే ఈ చిరుపుస్తకం అందజేస్తున్నాము.

ఇందులో రెండు వ్యాసాలున్నాయి. ఒకటి, ప్రసిద్ధ తత్వవేత్త మౌలానా మౌదూది (రహ్మలై) వ్రాసినది. అందులో మద్యం వల్ల ఇటీవలి కాలంలో అనుభవంలోకి వచ్చిన రుగ్మతల్ని గణాంక వివరాలతో సహా చూపడం జరిగింది.

రెండవది, అఖిల భారత మద్యనిషేధ కౌన్సిల్ ఆధ్వర్యాన ఢిల్లీలోని ఆర్య సమాజ్ దివాన్ హాల్‌లో 1983 మార్చి 12న "మద్యనిషేధ ఉద్యమంలో ధార్మిక, సంఘసేవా సంస్థల పాత్ర" అన్న అంశంపై సెమినార్‌లో జమాఅతె ఇస్లామీ హింద్, ఆనాటి అధ్యక్షులు దైవ కారుణ్యార్హులైన మౌలానా అబుల్ లైస్ ఇస్లాహి నద్వీగారు కౌన్సిల్ ఆహ్వానంపై పాల్గొని, అక్కడ చేసిన ప్రసంగ పాఠం.

ఈ చిరు పుస్తకం నిర్దిష్ట ఉద్దేశ్యాన్ని నెరవేర్చడంలో మద్యాన్ని వ్యతిరేకించేవారందరికీ బాగా సహాయపడగలదని ఆశిస్తున్నాము.

- ప్రకాశకులు

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# కాల్పనిక సిద్ధాంతాలు: దైవాదేశాలు

అమెరికాలో మద్యనిషేధ చట్టాన్ని పూర్తిగా రద్దు చేసే ప్రకటన డిసెంబరు 1933 ఆరంభంలో వెలువడింది. మద్యనిషేధ చట్టం కారణంగా దాదాపు 14 ఏళ్ళపాటు 'నీరస' జీవనాన్ని గడిపిన ఆధునిక నాగరికత ధ్వజవాహకులు మళ్ళీ 'సరస' సురాప్రవాహంలో ఈదులాడారు. అమెరికా అధ్యక్ష పదవిని రూజ్‌వెల్ట్ అధిరోహించడంతోనే 'నీరస' జీవనానికి స్వస్తి వాచకం తప్పదనీ, నిషాలో తూగే 'సరస మధుర' జీవనానికి మళ్ళీ మంచి రోజులొచ్చాయని తేలిపోయింది. రూజ్‌వెల్ట్ అధ్యక్షుడయిన తరువాత మొదటి చర్యగా 1933 ఏప్రిల్‌లో ఒక చట్టం చేస్తూ 2, 3 శాతం ఆల్కహాల్ కలిగి ఉన్న మద్యాన్ని అనుమతించాడు. మరికొన్ని మాసాలు గడిచిన తరువాత అమెరికా రాజ్యాంగంలోని 18వ సంస్కరణను- అమెరికాలో మద్య క్రయ విక్రయాలను, ఎగుమతి దిగుమతులను, ఉత్పత్తిని నిషేధించే సంస్కరణను- పూర్తిగా రద్దు చేసేశాడు.

నైతిక, సామాజిక సంస్కరణకుగాను చట్టపరంగా జరిగిన చెప్పుకోదగ్గ ప్రయత్నం అమెరికా రాజ్యాంగపు 18వ సంస్కరణ. ఇలాంటి మరో ఉదాహరణ ఆధునిక ప్రపంచ చరిత్రలో కానరాదు. ఈ 18వ సంస్కరణకు ముందు అనేక సంవత్సరాలపాటు యాంటి సెలూన్ లీగ్ (మద్య వ్యతిరేక కూటమి), పత్రికల ద్వారా, ప్రసంగాల ద్వారా, సినిమాల ద్వారా, చిత్ర ప్రదర్శనల ద్వారా, ఇంకా ఇలాంటి అనేకానేక పద్ధతుల ద్వారా మద్యపాన నష్టాలను అమెరికా పౌరులకు ఎరుకపరిచే తీవ్ర ప్రయత్నాలు చేసింది. ఈ ప్రచార కార్యక్రమానికిగాను ఆ సంస్థ రూపాయల్ని నీళ్ళలా ఖర్చు చేసింది. మద్యపాన వ్యతిరేక ఆందోళన మొదలయినప్పటి నుంచి 1925 వరకు ప్రచార ప్రసార కార్యక్రమాలకు ఆరున్నర కోట్ల డాలర్లు ఖర్చయ్యాయి. మద్యానికి వ్యతిరేకంగా, మద్యపాన నష్టాలను ఏకరువు పెట్టే పుస్తకాలు, కరపత్రాలు వగైరా దాదాపు 19 వందల కోట్ల సంపుటాలు ఉంటాయి.

ఇంత ప్రయాసపడి మద్యనిషేధం సాధించిన తరువాత పధ్నాలుగేళ్ళ పాటు అమెరికా భరించిన ఆర్థిక భారం దాదాపు 46 కోట్ల పౌండ్లుగా పేర్కొన్నారు. అమెరికా ప్రభుత్వం 1920 నుంచి 1933 మధ్యకాలానికి సంబంధించిన గణాంక వివరాలను ప్రచురించింది. వాటి ప్రకారం మద్యనిషేధాన్ని అమలు చేయడంలో రెండు వందల మంది హతులయ్యారు. 5,44,334 మంది జైలుకు వెళ్ళారు. ఒక కోటి అరవై వేల పౌండ్ల జరిమానాలు విధించబడ్డాయి. నలభై కోట్ల నలభై లక్షల పౌండ్ల సంపద జప్తు చేయబడింది.

ఇంతటి కష్టనష్టాలను భరించడానికి అమెరికన్లు ఎందుకు సిద్ధపడ్డారు?

ఇరవయ్యో శతాబ్దపు ఆధునిక జాతి, వైజ్ఞానికంగా, సాంకేతికంగా అత్యున్నత శిఖరాలను అధిరోహించిన జాతి, పాపజనని పాలబడకుండా ఉండాలనే ఇన్ని కష్టాలను సహించారు. మద్యం వల్ల వాటిల్లే అనేకానేక ఆధ్యాత్మిక, నైతిక, ఆరోగ్య, ఆర్థిక నష్టాల నుంచి జాతిని పరిరక్షించడానికే ఇన్ని బాధలను భరించారు. కానీ మద్యనిషేధం చట్టబద్ధం కావడానికి ముందు, ఆ తరువాత మద్యనిషేధానికై జరిగిన తీవ్ర ప్రయత్నాలు ఫలించని ప్రయాసలే అయ్యాయి. మద్యాన్ని మటుమాయం చేసే కృషిలో స్వయాన ప్రభుత్వమే ఆసక్తితో పాల్గొన్నప్పటికీ అమెరికా ప్రజల మద్యప్రియత్వం ముందు ప్రభుత్వం కూడా చేతులెత్తక తప్పలేదు. ప్రపంచ చరిత్రలో మద్యంపై ప్రభుత్వ స్థాయిలో జరిగిన మొదటి పోరాటం నిష్ఫలమయ్యింది.

మద్యనిషేధం చట్టాన్ని అమెరికా ప్రభుత్వం రద్దు చేయడానికి కారణం మద్యం వల్ల లాభాలున్నాయని కాదు. ఏ క్రొత్త వైజ్ఞానిక పరిశోధనలూ మద్యపానం వల్ల కనుగొన్న క్రొత్త లాభం అంటూ ఏదీ లేదు. పైగా, దురాచారాలు, వ్యభిచారం, అనైతికత, దొంగతనాలు, జూదం, హత్యలు తదితర పాపాలన్నింటికి మద్యం కారణభూతమని మరింత దృఢంగా నిరూపితమయ్యింది. పాశ్చాత్య దేశాల చరిత్రలో మద్యం సృష్టించిన ఆర్థిక, సామాజిక వినాశాలు అనేకం ఉన్నాయి. అయినప్పటికీ, వాస్తవాలు ఇలా ఉన్నప్పటికీ అమెరికా ప్రభుత్వం మద్యనిషేధాన్ని రద్దు చేయడానికి కారణం ఏమిటి?

కారణమేమంటే, అమెరికా ప్రజలలో అధిక సంఖ్యాకులు ఆరు నూరైనా సరే మద్యాన్ని మానడానికి ఇష్టపడలేదు. మద్యనిషేధం కావాలని కోరినవారే పధ్నాలుగేళ్ళ తరువాత మద్యం కావాలని కోరారు.

మనకు తెలిసినంతవరకు, మద్యపానం వల్ల వాటిల్లే నష్టాలను మహా త్రాగుబోతులైన వాళ్ళు కూడా ఏనాడూ కాదనలేదు. మద్యనిషేధాన్ని వ్యతిరేకించేవాళ్ళు కూడా ఏనాడూ మద్యం వల్ల లాభాలున్నాయని వాదించ లేదు. అమెరికా కాంగ్రెసులో ప్రజాబాహుళ్య మద్దతుతో రాజ్యాంగపు 18వ సంస్కరణను ప్రతిపాదించినప్పుడు మద్యం వల్ల వాటిల్లే సమస్త లాభనష్టాలపై కూలంకష చర్చ జరిగింది. మద్యం వల్ల అన్నీ నష్టాలే అన్న నిర్ణయానికి వచ్చిన తరువాతనే కాంగ్రెసు ఈ సంస్కరణను ఆమోదించింది. 46 రాష్ట్రాలు ఈ సంస్కరణను బలపరిచాయి. పార్లమెంటులోని రెండు సభలు ఈ సంస్కరణ ప్రకారం మద్యనిషేధ చట్టాన్ని చేశాయి. ఇదంతా అమెరికా పౌరుల అభిప్రాయం, వారి ఇష్టం ప్రకారమే జరిగింది. అయితే, మద్యనిషేధం అన్నది కాగితాలకు పరిమితమై ఉన్నంతకాలం, కేవలం నినాదంగా నాలుకపై నాట్య మాడినంత కాలం ప్రజలు మహోత్సాహంతో, మహానందంతో సమర్థించారు. కాని, మద్యనిషేధం అమలులోకి వచ్చిన తరువాత అమెరికన్ పౌరుల ముఖాలు వివర్ణమయిపోయాయి. పావజనని వియోగాన్ని భరించలేక పోయారు. ప్రపంచంలోనే శక్తిమంతమైన దేశం, నాగరికత, ఆధునికతలకు ఆలవాలమయిన దేశ ప్రజలు మద్యం లేకుండా ఒక్క రాత్రి గడపడం కనాకష్టమైపోయింది. అమెరికా జాతి మద్యవియోగంతో పిచ్చిదయిపోయింది. పిచ్చి చేష్టలు ఎక్కువయ్యాయి. ప్రాచ్య కవులు సృష్టించిన శృంగార కావ్యాల లోని భగ్న ప్రేమికుల మాదిరిగా నిజంగానే గుండె పగిలి చచ్చే స్థితికి చేరింది అమెరికా జాతి.

మద్యశాలలు మూతబడిన వెంటనే దేశవ్యాప్తంగా లక్షలాది దొంగ సారా అంగళ్ళు వెలిశాయి. చట్టం చేతుల్లో చిక్కకుండా మద్యాన్ని త్రాగడానికి, త్రాగించడానికి, తయారు చేయడానికి, అమ్మడానికి, కొనడానికి నానారకాల ఎత్తులు, పైయెత్తులు వేయడం మొదలయ్యింది. ఈ రహస్య మద్య విక్రయశాలల చిరునామాలను ఒక వ్యక్తి మరొక వ్యక్తితో చెప్పడమంటే చాలా పెద్ద మేలు చేసినట్లు పరిగణించేవారు. ఆరంభంలో ప్రభుత్వం అంతకు ముందు నడిచిన లైసెన్స్డ్ మద్య దుకాణాల సంఖ్య, అక్కడ అమ్ముడయ్యే మద్యంలో రకాలు, ఆ దుకాణాలకు వచ్చి పోయేవారి పరిస్థితి తదితర వివరాలను స్వీకరించి వారిపై నిఘా ఉంచేది. కాని ఈ పాపగృహాలు ప్రభుత్వ

నిఘాను తప్పించుకోగలిగాయి. ఆ విధంగా ఈ రహస్య గృహాల సంఖ్య మునుపటి లైసెన్స్‌డ్ దుకాణాలకన్నా అనేక రెట్లు పెరిగేవి. ఈ దుకాణాల్లో అన్ని రకాల మద్యం, అత్యంత హానికరమయిన మద్యం కూడా అమ్ముడు కాసాగేది. ఈ దుకాణాలకు వచ్చిపోయేవారిలో స్వల్ప వయస్కులయిన బాలబాలికల సంఖ్య పెరిగిపోయింది. ఫలితంగా భయానక పరిణామాలు చోటుచేసుకున్నాయి. ఈ పరిణామాలు అమెరికాలోని సమాజ శ్రేయోభిలాషుల్లో ఆందోళనను సృష్టించాయి. మద్య వ్యాపారం ఓ అత్యధిక లాభదాయకమైన వ్యాపారంగా మారింది. వేలాది, లక్షలాది మంది ప్రజలు ఈ పాపపంకిలమైన వ్యాపారంలో మునిగిపోయారు. మద్యాన్ని రహస్య స్థావరాల్లో అమ్మడమేకాక అటూ ఇటూ తిరుగుతూ రహస్యంగా మద్యాన్ని అమ్మేవారి సంఖ్య కూడా పెరిగిపోయింది. స్కూళ్ళల్లో, ఆఫీసుల్లో, హోటళ్ళల్లో, విహార స్థలాలలో చివరకు ఇంటింటికి తిరిగి మద్యాన్ని అమ్మేవారు పుట్టుకొచ్చారు. మద్యనిషేధానికి ముందు ఆల్కహాల్ సేవించేవారి సంఖ్యతో పోలిస్తే మద్యనిషేధం వచ్చిన తరువాత త్రాగేవారి సంఖ్య పది రెట్లు పెరిగింది. నగరాలు, పట్టణాలు దాటి ఈ వ్యాపారం పల్లెలకు కూడా వ్యాపించింది. గ్రామగ్రామాన సారా తయారు చేసే రహస్య కేంద్రాలు స్థాపితమై పోయాయి.

మద్యనిషేధానికి ముందు అమెరికాలో మద్యాన్ని తయారు చేసే లైసెన్స్ పొందిన కార్ఖానాలు కేవలం నాలుగు వందలుండేవి. మద్యనిషేధం వచ్చిన తరువాత అవి మూతబడ్డాయి. కాని, మద్యనిషేధం వచ్చిన ఏడేళ్ళ లోగా 79,527 కార్ఖానాలు పట్టుబడ్డాయి. 9,381 సారా భట్టీలు పట్టుబడ్డాయి. అయినప్పటికి మద్యం క్రయ విక్రయాలు ఏ మాత్రం తగ్గలేదు సరికదా మరింత పెరిగాయి.

"మేము మొత్తం కార్ఖానాలు, భట్టీలలో కేవలం పదవ వంతు వాటిని మాత్రమే పట్టుకోగలిగాం" అని స్వయాన ప్రభుత్వ మద్యనిషేధ విభాగపు ఓ మాజీ కమిషనర్ వ్యాఖ్యానించాడు.

అలాగే మద్యం ఉత్పత్తి అత్యధిక పరిమాణంలో పెరిగింది. ఒక అంచనా ప్రకారం మద్యనిషేధం వచ్చిన తరువాత అమెరికన్లు ప్రతి ఏటా 20 కోట్ల గ్యాలన్ల మద్యాన్ని త్రాగేవారు. ఈ పరిమాణం మద్యనిషేధం రాకముందుకన్నా చాలా ఎక్కువ.

పైగా ఈ దొంగచాటుగా అమ్ముడువుతున్న మద్యం అత్యంత హాని కరమైనది. డాక్టర్ల ప్రకారం:

"దీన్ని మద్యం అనే బదులు విషం అంటే బాగుంటుంది. ఇది గొంతులోకి దిగిన వెంటనే జీర్ణాశయంపై, మెదడుపై విషప్రభావాన్ని వేస్తుంది. రెండు రోజుల వరకు ఈ ప్రభావం ఉంటుంది. దాని నిషాలో మనిషి మనస్తత్వం విధ్వంసాన్ని చేయాలని ఉవ్విళ్ళూరుతుంది."

ఇలాంటి మద్యాన్ని అత్యధికంగా సేవించడం వల్ల అమెరికనుల ఆరోగ్యం వికృత ప్రభావానికి లోనయ్యింది. ఉదాహరణకు న్యూయార్క్ నగర గణాంకాల ప్రకారం, మద్య నిషేధానికి ముందు 1918లో ఆల్కాహాల్ ప్రభావం వల్ల వ్యాధిగ్రస్తులయినవారి సంఖ్య 3,749. మరణించినవారి సంఖ్య 252. 1926లో వ్యాధిగ్రస్తులయినవారి సంఖ్య పదకొండు వేలు, మరణించినవారి సంఖ్య ఏడు వేలకు పెరిగింది. అంతేకాదు, మద్యం వల్ల వాటిల్లిన పరోక్ష ప్రభావానికి గురై మరణించినవారి సంఖ్య అంచనాలకు అందనిది.

అలాగే, నేరాల సంఖ్య అపరిమితంగా పెరిగింది. ముఖ్యంగా బాల నేరస్తుల సంఖ్య పెరిగింది. అమెరికా న్యాయమూర్తుల వ్యాఖ్యల ప్రకారం:

"దేశ చరిత్రలో ఇంత పెద్ద సంఖ్యలో పిల్లలు మైకంలో మునిగి నిర్బంధితులయిన ఉదాహరణ మరొకటి లేదు."

బాల నేరస్తుల సంఖ్య పెరిగిపోవడంతో ఈ విషయమై పూర్తి విచారణ ప్రారంభించారు. విచారణలో 1920 తరువాత నుంచి పిల్లల్లో, యువకుల్లో మద్యపానం, జూదం తదితర చెడులు విపరీతంగా పెరిగినట్లు తేలింది. కొన్ని నగరాల్లో అయితే కేవలం ఎనిమిదేళ్ళలో ఇలాంటి వారి సంఖ్య 200 రెట్లు పెరిగింది. 1933లో అమెరికన్ నేషనల్ క్రైం కౌన్సిల్ డైరెక్టర్ జనరల్, 'మాస్' దేశంలోని పరిస్థితులపై వ్యాఖ్యానిస్తూ, "అమెరికాలో ప్రతి ముగ్గురు పౌరుల్లో ఒకడు నేరస్తుడు. హత్యల్లాంటి నేరాలు 350 శాతం పెరిగిపోయాయి" అన్నాడు.

ఆయన వ్యాఖ్యల్లోని భావం స్పష్టంగా ఉంది. పధ్నాలుగేళ్ళపాటు అమలులో ఉన్న మద్యనిషేధం వల్ల అమెరికాలో చోటుచేసుకున్న పరిణా మాలు క్లుప్తంగా చెప్పాలంటే:

చట్టం పట్ల గౌరవం నశించింది. సమాజంలోని ప్రతి వర్గంలోనూ శాసనోల్లంఘన వ్యాధి ప్రబలంగా వ్యాపించింది.

మద్యనిషేధ లక్ష్యాలు ప్రాప్తం కాలేదు. పైగా మద్యనిషేధం తరువాత పాపజనని మునుపటికన్నా అత్యధికంగా వాడకంలోకి వచ్చింది.

మద్యనిషేధాన్ని అమలు చేయడం వల్ల ప్రభుత్వం ఆర్థిక నష్టాన్ని భరించవలసివచ్చింది. కాగా, రహస్యంగా మద్య క్రయవిక్రయాలు జరగడం వల్ల ప్రజలు కూడా ఆర్థికంగా నష్టపోయారు. దేశ ఆర్థిక పరిస్థితి దిగజార సాగింది.

వ్యాధులు విపరీతమయ్యాయి. ప్రజారోగ్యం దెబ్బతిన్నది. మరణాలు పెరిగాయి. నైతిక విలువలు దెబ్బతిన్నాయి. సమాజంలోని అన్ని వర్గాల్లోనూ, ముఖ్యంగా క్రొత్తతరం వారిలో చెడులు విపరీతమయ్యాయి. నేరాలు అపరిమితమయ్యాయి.

ఇరవయ్యో శతాబ్దంలో, ప్రగతిశీలక యుగంలో, అత్యంత ఆధునిక, ప్రజాస్వామ్య నాగరిక దేశంలో మద్యనిషేధ చట్టం వల్ల తలెత్తిన పరిణామాలు ఇవి. తమకేది లాభదాయకమో, ఏది నష్టదాయకమో గ్రహించే అవగాహన ఉన్న అమెరికా పౌరుల ప్రవర్తన ఇది.

కోట్లాది డాలర్లు నీళ్ళలా ఖర్చు చేసి, కోట్లాది పుస్తకాలు, కరపత్రాలు ప్రచురించి పూర్తి దేశంలో మద్యపానం వల్ల వాటిల్లే నష్టాలను విస్తృతంగా ప్రచారం చేసిన తరువాత కూడా ఈ విపరీత పరిణామాలు తప్పలేదు.

అమెరికా ప్రజలలో అధిక సంఖ్యాకులు మద్యనిషేధాన్ని కోరుకున్నప్పటికీ, మద్యనిషేధం ప్రజల అభిలాషలకు అనుగుణంగానే అమలులోకి వచ్చినప్పటికీ ఈ పరిణామాలు చోటుచేసుకున్నాయని గమనించాలి.

అంతేకాదు, అత్యంత శక్తిమంతమైన అమెరికా ప్రభుత్వం మద్యాన్ని సమాజంలో నుంచి కూకటివ్రేళ్ళతో సహా పెకలించి పారెయ్యాలని శాయశక్తులా పద్నాలుగేళ్ళపాటు కృషి చేసినా ఈ పరిణామాలు అనివార్యమయ్యాయి.

ఈ పరిణామాలు బయల్పడకముందు ప్రభుత్వం, ప్రజలు మద్యాన్ని నిషేధించే విషయంలో ఏకాభిప్రాయం కలిగివున్నారు. అందువల్లనే మద్య నిషేధం ప్రకటన సునాయాసంగా వెలువడింది. కాని, మద్యానికి వీడ్కోలు పలకడానికి జాతి సుతరాము సిద్ధపడడంలేదని స్పష్టమైనప్పుడు, మద్య నిషేధం వల్ల పరిస్థితి మునుపటికన్నా దిగజారిందని తెలిసినప్పుడు, ప్రజలు, ప్రభుత్వం మళ్ళీ మద్యాన్ని చట్టబద్ధం చేయడానికి సిద్ధమైపోయారు.

ఇది అమెరికాలో మద్యనిషేధం కథ.

ఇప్పుడు ప్రపంచంలో మరో చోట మద్యనిషేధం ఎలా అమలయ్యిందో చూద్దాం.

నేటికి 1400 సంవత్సరాలకు పూర్వపు అంధకారబంధుర యుగంలో, మరింత చీకటిలో కొట్టుమిట్టాడుతున్న దేశంగా పరిగణించబడిన దేశమది. అక్కడి పౌరులు అజ్ఞానులు, జ్ఞాన విజ్ఞానాలు అక్కడ కంచు కాగడా పెట్టి వెదికినా కానరావు. నాగరికత అన్నది మచ్చుకు కూడా కనబడదు. చదవను, రాయను తెలిసినవాడు పదివేల మందిలో ఒక్కడు కూడా ఉండేవాడు కాదు. ఆ ఒక్కడికి తెలిసిన భాషకన్నా నేటి పిల్లలకు తెలిసిన భాష చాలా ఎక్కువ. నేటి ఆధునిక యుగంలో ప్రచార ప్రసార సాధనాలు ఆనాడు శూన్యం. అక్కడి పౌరులు మద్యంతోనే ముఖం కడిగే మహా త్రాగుబోతులు. వారి భాషలో మద్యానికి దాదాపు 256 పేర్లుండేవి. ఇలాంటి భాష బహుశా ప్రపంచంలో మరొకటి ఉండదు. మద్యం వారికి ఎంత ప్రియమయినదో వారి భాష ద్వారా స్పష్టమవుతుంది. వారి కవితల్లో మద్యమే ముఖ్య వస్తువు.

ఇలాంటి దేశంలో ప్రభవించిన అంతిమ దైవప్రవక్త ముహమ్మద్(స)ను ప్రజలు మద్యం విషయమై దైవాదేశాలు ఏమిటని ప్రశ్నించినప్పుడు ఆయన దైవాదేశాల్ని ఇలా వినిపించారు:

"వాళ్ళు మిమ్మల్ని మద్యం, జూదాల గురించి అడుగుతున్నారు. ఈ రెంటిలోనూ తీవ్ర చెడులు ఉన్నాయని చెప్పండి. ప్రజలకిందులో కొన్ని లాభాలున్నప్పటికీ వాటిలోని నష్టాలు లాభాలకన్నా అత్యధికం."

ఇది ఆదేశం కాదు. కేవలం మద్యం గురించిన నిజాలను తెలియజేయడం మాత్రమే జరిగింది. మద్యంలో మంచీ చెడులున్నాయని, కాగా,

చెడు అత్యధికంగా ఉందని వివరించడం జరిగింది. ఈ బోధన వల్ల సమాజం లోని ఓ వర్గం తక్షణం మద్యపానాన్ని మానివేసింది. అయినా సమాజంలో అత్యధిక సంఖ్యలో ప్రజలు మత్తులోనే మునిగి ఉండేవారు.

మళ్ళీ రెండోసారి మద్యం విషయమై దైవాదేశాలు వచ్చాయి. ఎందుకంటే, కొందరు ప్రజలు మద్యం త్రాగి నిషాలోనే నమాజు చేసేవారు, మత్తులో అనేక పొరపాట్లు చేసేవారు. ఈసారి దైవప్రవక్త ముహమ్మద్ (స) దైవం తరపున క్రింది ఆదేశాన్ని విన్పించారు:

"ఓ విశ్వసించిన ప్రజలారా! నిషా స్థితిలో నమాజు చేయవద్దు. మీరు పలికేదేమిటో మీరు తెలుసుకోగలిగిన స్థితిలోనే నమాజు చదవాలి."

ఈ ఆదేశం విన్న ప్రజలు మద్యం త్రాగడానికి సమయాన్ని నిర్ణయించు కున్నారు. సాధారణంగా ఫజర్, జుహర్ నమాజుల మధ్యకాలంలో లేదా ఇషా నమాజు తరువాత మద్యాన్ని త్రాగేవారు. ఆ విధంగా నిషాలో ఉండి నమాజు చేసే పరిస్థితి రాకుండా ఏర్పాట్లు చేసుకున్నారు. నిషాలో ఉన్నందు వల్ల నమాజు విడిచిపెట్టే పరిస్థితి లేకుండా చేసుకున్నారు.

అయితే మద్యం ఇంకా వారి మధ్యలో హానికారకంగా ఉండనే ఉండింది. నిషా వల్ల ప్రజల మధ్య ఘర్షణలు, కలహాలు జరుగుతూ ఉండేవి. ఒక్కోసారి రక్తపాతం కూడా సంభవించేది. అందువల్ల మద్యం గురించిన స్పష్టమైన, నిర్ధారితమైన ఆదేశాలు రావాలన్న అభిలాష ఎల్లెడలా వ్యక్త మయ్యింది. ఆపై దైవాదేశాలు ఇలా అవతరించాయి:

"విశ్వసించిన ఓ ప్రజలారా! సారాయి, జూదం (దైవేతర శక్తుల) ఆరాధ నాలయాలు, పాచికల ద్వారా జోస్యం- ఇవన్నీ అసహ్యకరమైన షైతానీ పనులు. వాటిని విసర్జించండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే అవకాశం ఉంది. షైతాను సారాయి, జూదాల ద్వారా మీ మధ్య విరోధ విద్వేషాలను సృష్టించాలనీ, మిమ్మల్ని అల్లాహ్ ధ్యానం నుంచి, నమాజు నుంచి నిరోధిం చాలని కోరుతాడు. కనుక మీరు వాటిని మానుకుంటారా లేదా? అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త మాట వినండి మరియు మానుకోండి. మీరు ఆజ్ఞల్ని పాలించక పోతే, బాగా తెలుసుకోండి, మా ప్రవక్తపై ఉన్న బాధ్యత కేవలం ఆజ్ఞల్ని స్పష్టంగా అందజేయడమే." (అల్ మాయిదా: 90-92)

ఈ ఆదేశం వచ్చిన వెంటనే మద్యం అంటే ప్రాణాలర్పించే మద్య ప్రియులు కూడా మద్యాన్ని అసహ్యించుకున్నారు. మద్యనిషేధ ప్రకటన వెలువడిన వెంటనే మద్యం నిండిన మృణ్మయ పాత్రలు బ్రద్దలయ్యాయి. మదీనా నగర వీధుల్లో పారవేసిన మద్యం ప్రవాహమై ప్రవహించింది. ఒకచోట కొందరుజేరి మద్యం సేవిస్తున్నారు. పది, పదకొండు మంది మత్తులో పూర్తిగా మునిగివున్నారు. ఇంతలో దైవప్రవక్త ముహమ్మద్ (స) చేసిన మద్యనిషేధ ప్రకటన చెవులకు సోకింది. ఆ మత్తులో కూడా దైవాదేశా లను వాళ్ళు తక్షణం అమలుజరిపారు. మద్యపానం వెంటనే ఆగిపోయింది. మద్యపాత్రలు ముక్కలయ్యాయి. ఓ వ్యక్తి గురించయితే మరింత ఆసక్తి కరమైన కథనం ఉంది. అతడు మద్యాన్ని త్రాగుతుండగా, పెదవుల మధ్య చషకం ఉన్నప్పుడు ఎవరో వచ్చి మద్యనిషేధ ప్రకటనను వినిపించారు. ఆ వెంటనే అతడు ఆ చషకాన్ని క్రిందికి దించాడు. ఆ తరువాత ఒక్క బొట్టు సారా కూడా అతడి గొంతులో దిగలేదు. ఆ తరువాత మద్యాన్ని త్రాగినవారిని చెప్పులతో, కాళ్ళతో, చేతులతో కొట్టేవారు. ఆ తరువాత మద్యపానానికి నలభై కొరడా దెబ్బల శిక్ష నిర్ధారితమయ్యింది. ఆ తరువాత ఆ శిక్ష ఎనభై కొరడా దెబ్బలకు పెంచబడింది. ఫలితంగా అరబ్బు దేశంలో మద్యం పేరు కూడా వినబడని విధంగా నమసిపోయింది. ఆ తరువాత ఇస్లామ్ ప్రవేశించిన ప్రతీ ప్రాంతంలోనూ మద్యనిషేధం విజయవంతంగా అమలయ్యింది. నేటికీ, ఇస్లామ్ ప్రభావం అత్యంత బలహీనంగా ఉన్న ప్రస్తుత ప్రపంచంలోనూ కోట్లాది ప్రజలు మద్యనిషేధ చట్టాలు ఎలాంటివీ లేకపోయినా సరే కేవలం ఇస్లామీయ ఆదేశాల వల్ల మద్యానికి దూరంగా ఉంటున్నారు. ముస్లిముల్లో మద్యపానం అలవాటు ఉన్నవారి గణాంక వివరాలను స్వీకరించినట్లయితే ప్రపంచంలోని ఇతరేతర జాతులలోకన్నా ముస్లిముల్లో మద్యపానం అతి తక్కువన్న నిజం తెలిసివస్తుంది. అంతేకాదు, ముస్లిముల్లోనూ మద్యపానం చేసేవారు దీన్ని పాపపు పనిగా ఒప్పుకుంటారు. తాము చేస్తున్న పనికి సిగ్గుపడతారు. అప్పుడప్పుడు పశ్చాత్తాపపడుతుంటారు.

మద్యనిషేధం అమలుచేసిన అమెరికా అనుభవాన్ని తెలుసును కున్నాము. ఇస్లామ్ అమలులోకి తెచ్చిన మద్యనిషేధాన్ని గురించీ తెలియజేశాము. ఈ రెండు ప్రయోగాలు మనముందున్నాయి. వైజ్ఞానికంగా

ఆలోచిస్తే, ప్రయోగాల ఫలితాల ఆధారంగా అంతిమ నిర్ణయాలు చేయాలి. మనముందు రెండు ప్రయోగాలు, వాటి ఫలితాలు స్పష్టంగా ఉన్నాయి. ఈ రెండు ప్రయోగాలను, ఫలితాలను తులనాత్మకంగా అధ్యయనం చేసి తగు పాఠాన్ని గ్రహించడమే బుద్ధిమంతుల పని.

అమెరికాలో అనేక ఏళ్ళపాటు మద్యానికి వ్యతిరేకంగా ప్రచారం జరిగింది. కోట్లాది రూపాయలను ఖర్చు చేసి మద్యం వల్ల కలిగే నష్టాలను ప్రజలందరికీ ఎరుకపరిచారు. వైద్య శాస్త్ర వివరాల ద్వారా, గణాంకాల ఆధారంతో, తార్కికంగా మద్యం వల్ల వాటిల్లే ఆరోగ్య, నైతిక, ఆర్థిక నష్టాలను తార్కికంగా, ఎవ్వరూ కాదనలేనట్లుగా రుజువు చేయడం జరిగింది. చిత్ర పటాల ద్వారా మద్యపాన నష్టాలను కళ్ళకుకట్టినట్లు చూపారు. ప్రజలు మద్యపాన నష్టాలను స్వయంగా తెలుసుకుని ఈ దురలవాటుకు దూరంగా ఉండేలా చేయడానికి సకల ప్రయత్నాలూ జరిగాయి. పైగా దేశంలోని అతి పెద్ద పార్టీ (కాంగ్రెస్) 29-10-1933న అత్యధిక మెజారిటీతో మద్యపాన నిషేధాన్ని ఆమోదించింది. అవసరమైన చట్టాలను చేసింది. ఆపై ప్రభుత్వము- ప్రపంచంలోనే అత్యంత శక్తిమంతమైన అమెరికా ప్రభుత్వం- మద్య క్రయవిక్రయాలను, ఉత్పత్తిని, ఎగుమతి దిగుమతులను నిరోధించ డానికి శాయశక్తులా కృషి చేసింది. కాని ప్రజలు- ప్రపంచంలోనే ఆధునికులు, నాగరికులు, విజ్ఞానవంతులుగా పేరెన్నికగన్న అమెరికా ప్రజలు- మద్యాన్ని విడిచిపెట్టడానికి ఎంత మాత్రమూ ఇష్టపడలేదు. కేవలం పద్నాలుగేళ్ళ స్వల్ప కాలంలోనే తప్పనిసరై ప్రభుత్వం మద్యనిషేధాన్ని రద్దు చేయవలసి వచ్చింది.

మరో వైపు ఇస్లామ్‌లో మద్యానికి వ్యతిరేకంగా అంత పెద్ద ఎత్తున ప్రచారమేదీ జరగలేదు. ప్రచార కార్యక్రమానికి ఒక్క పైసా కూడా ఖర్చు కాలేదు. మద్య వ్యతిరేక లీగు (యాంటి సెలూన్ లీగ్) ఏదీ స్థాపించబడలేదు. దైవప్రవక్త (స) చెప్పిన ఒక మాట, "దైవం మద్యాన్ని హరామ్ (నిషిద్ధం) చేశాడు" అన్నది. ఆయన నోట ఆ దైవాదేశం వెలువడిన వెంటనే ప్రజలందరూ- మద్యం అంటే పడిచచ్చే ఆనాటి అనాగరిక ప్రజలు- మద్యాన్ని పారబోశారు. అంతేకాదు, మద్యాన్ని ఎలా మానారంటే, ఇస్లాంను నమ్ముకుని ముస్లిములుగా ఉన్నంత కాలం మళ్ళీ మద్యాన్ని ముట్టడం అసంభవం అని తెలిసీ మద్యాన్ని మాని ఇస్లామ్‌కు కట్టుబడ్డారు. మద్యం మానిపించడానికి

గాను వారిపై ఎలాంటి శాసన శక్తి, శిక్షాభయం, నిఘా విభాగాలు పనిచేయ లేదు. ప్రభుత్వపరమైన కట్టుదిట్టాలు లేకపోయినప్పటికీ వాళ్ళు మద్యాన్ని ముట్టేవారు కాదు. అంతేకాదు, ఇస్లామ్ విధించిన మద్యనిషేధం మళ్ళీ సంస్కరణల పేరిట రద్దు చేయగలిగినది కాదు. ఇది శాశ్వతమైన మద్య నిషేధం. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ముస్లిములందరూ కలసి కట్టుగా మద్యం కావాలని అరచిగీపెట్టినప్పటికీ ఈ నిషేధం రద్దు కాదు. హరామ్ (నిషిద్ధం) హలాల్ (ధర్మసమ్మతం) కాదు.

అమెరికా ప్రయోగాన్ని, ఇస్లామ్ విధించిన మద్యనిషేధాన్ని ఈ రెంటి మధ్యగల భేదాన్ని పరిశీలిస్తే, కేవలం మద్యం విషయంలోనేకాదు, నైతికత విషయంలోనూ, శాసనాల విషయంలోనూ సమస్త సమస్యల మూల కారణాలు తెలిసివస్తాయి.

ఇస్లామ్‌కు, మానవ రచిత సిద్ధాంతాలకు మధ్య మౌలిక భేదం ఉంది. మానవ కల్పిత సిద్ధాంతాలు ప్రజాభిప్రాయాలపై ఆధారపడి ఉంటాయి. అందువల్ల అవి సాధారణ ప్రజల లేదా ప్రత్యేక సమాజంలో ఉన్నత స్థాయిల్లో ఉన్న వ్యక్తుల అభిప్రాయాలకు బద్ధంగా ఉండక తప్పదు. ఇక ప్రజాభిప్రాయం (సాధారణ ప్రజలదైనా లేక కొందరు ప్రత్యేక వ్యక్తు లదయినా ఎవరిదయినా సరే) ఎల్లప్పుడూ మానవ ప్రవృత్తిపై, మనిషి బుద్ధీ జ్ఞానాలపై ఆధారపడి ఉంటుంది. ఈ ప్రజాభిప్రాయం ఎల్లప్పుడూ సరయినది కాకపోవచ్చు.

మనిషి బుద్ధివివేకాలు జ్ఞానవిజ్ఞానాల ప్రభావం ప్రజాభిపాయంపై ఉంటుంది. అందువల్ల అభిప్రాయాలలో మార్పులు రావచ్చు. కాలాను గుణంగా వచ్చే మార్పులు- అభిప్రాయాలలో, విలువలలో వచ్చే మార్పుల వల్ల మంచి, చెడు, సత్క్రియ, దుష్కర్మ, చట్టబద్ధం, శాసన వ్యతిరేకం, నిషిద్ధం, నిషిద్ధం కాకపోవడం, తదితరాలు మార్పునొందుతుంటాయి. నిషిద్ధ చర్యలకు విధించబడే శిక్షలు కూడా మారిపోతుంటాయి. వీటితోపాటు చట్టా లను కూడా మార్చవలసివస్తుంది. ఈ విధంగా నైతిక, సాంస్కృతిక అంశాలేవీ పరివర్తన పొందకుండా మిగలలేవు. మనిషిలోని కాలానుగుణంగా మార్పు నొందే స్వభావం శాసనాలపై ప్రభావం వేస్తుంది. ఫలితంగా మార్పునొందే శాసనాలు ప్రజా జీవనంపై ప్రభావం వేస్తున్నాయి.

ఇది ఎలా ఉంటుందంటే, కొత్తగా డ్రైవింగ్ నేర్చుకునేవాడు కారు నడుపుతున్నప్పుడు అభ్యాసం లేనందున స్టీరింగును అటూఇటూ త్రిప్పుతాడు. అతగాడి చేతకానితనం వల్ల కారు అష్ట వంకర్లు తిరుగుతూ పోతుంది. ఆ కారు తిన్ననైన మార్గంలో నడువలేదు. అటూ ఇటూ తిరుగుతూ అడ్డదిడ్డంగా వెళ్ళే ఆ కారులో కూర్చున్నవాడిపై కూడా కుదుపుల ప్రభావం పడుతుంది. కుదుపులతో, గోతుల్లోపడుతూ, ప్రక్కనున్న గోడల్ని ఢీకొంటూ పోతుంటుంది.

అయితే ఇస్లామ్ విషయం అలాంటిది కాదు. ఇస్లామ్‌లో శాసనాలు, నైతిక ప్రమాణాలు అన్నీ దైవం నిర్ణయించినవే. కాలానుగుణంగా మారే మనిషి ఆలోచనలకు ఇందులో ఎలాంటి జోక్యమూ లేదు. మనిషికి ఈ చట్టాల్లో జోక్యం చేసుకునే అధికారమంటూ ఏమన్నా ఉంటే అది; మారుతున్న సామాజిక పరిస్థితులనుబట్టి ఇస్లామీయ నైతిక ప్రమాణాలను, శాసనాలను అన్వయించుకునే పద్ధతిని తెలుసుకోడానికి మాత్రమే పరిమితం.

దైవిక సామాజిక వ్యవస్థను కలిగి ఉన్న ఇస్లామ్ వద్ద ఓ శాశ్వతమైన మార్పునొందని నైతిక నియమాలు ఉన్నాయి. ఇస్లామ్‌లోని నైతిక, సాంస్కృతిక శాసనాలు మార్పునొందే ప్రసక్తే లేదు. నిన్నటి నిషేధాన్ని నేడు రద్దు చేయడమన్నది ఇస్లామ్‌లో ముమ్మాటికి కుదరదు. ఇస్లామ్ నిషేధించినవి శాశ్వతంగా నిషిద్ధాలే. ఇస్లామ్ అనుమతించినవే శాశ్వతంగా ఆచరించదగినవి. ఇక్కడ జీవన పథంపై నడిచే కారు స్టీరింగును అత్యంత నిపుణుడైన పరమేశ్వరుడే నియంత్రిస్తున్నాడు. కాబట్టి కారు తిన్నగా, సాఫీగా సాగిపోతుంది.

ఖుర్‌ఆన్ ప్రకారం: అల్లాహ్ విశ్వసించినవారిని ఓ సద్వచనం ద్వారా ఇహపర లోకాల్లో దృఢంగా నిలబడేలా చేస్తాడు. అన్యాయాలకు పాల్పడే వారిని వాళ్ళు ఏకం కాలేని విధంగా వారిని చిందర వందర చేస్తాడు.

ఇందులో మరో ముఖ్య విషయమేమంటే, ప్రాపంచిక శక్తులు మానవ జీవన వ్యవస్థకు నియమాలను రూపొందించడానికిగాను, నైతిక, సామాజిక, సాంస్కృతిక సంస్కరణలు తేవడానికిగాను ఎల్లప్పుడు ముందుగా సాధారణ ప్రజలను సంస్కరణకు సిద్ధం చేయాలనీ, ఆ తరువాత సంస్కరణను ఆచరణలో పెట్టాలనీ ఆశిస్తాయి. వారి శాసనాలలోని ప్రతి అంశం ఆచరణా రూపునొందాలంటే సాధారణ ప్రజల అంగీకారం అవసరం. ఓ సామాజిక

సంస్కరణను తీసుకొచ్చే చట్టం సాధారణ జనాభిప్రాయానికి భిన్నంగా ఉన్నట్టయితే అది రద్దు కావలసి వస్తుంది. ఇది కేవలం అమెరికా అనుభవం మాత్రమే కాదు. ప్రపంచ వ్యాప్తంగా ఇలాంటి అనుభవాలు అనేకం ఉన్నాయి. ఈ అనుభవాలు ఓ వాస్తవాన్ని స్పష్టంగా రుజువు చేస్తున్నాయి. మానవ రచిత సిద్ధాంతాలకు నైతిక, సామాజిక సంస్కరణలు చేయగల సమర్థత లేదు. పెడదారిన పడినవారిని బాగు చేయడానికిగాను, ఆ పెడదారి పట్టినవాళ్ళ దయపైనే ఆధారపడతాయి ఈ సిద్ధాంతాలు. ఆ మార్గం తప్పినవాళ్ళ అంగీ కారం లేనిదే అమలులోకి రాలేవు.

ఇస్లామ్ ఈ సమస్యను మరో విధంగా పరిష్కరించింది. ఆలోచిస్తే ఇంతకు మించిన మరో పరిష్కారం లేదని అర్థమవుతుంది. నైతిక, సామాజిక, సాంస్కృతిక రుగ్మతలపై యుద్ధానికి ముందు ఇస్లామ్ మానవాళికి దైవాన్ని, దైవ ప్రవక్త(స)ను విశ్వసించమన్న సందేశాన్ని ఇచ్చింది.

ఈ సందేశాన్ని స్వీకరించే, లేదా తిరస్కరించే పూర్తి అధికారం మనిషికి ఉంది. కాని ఈ సందేశాన్ని అంగీకరించిన తరువాత మనిషి స్వీయ ఇష్టా యిష్టాల ప్రసక్తే ఉండదు. దైవాదేశాలన్నింటినీ, దైవ గ్రంథంలోని శాసనా లన్నింటినీ తు.చ. తప్పక పాటించి తీరవలసిందే.

ఇస్లామ్ పరిధిలోకి ప్రవేశించిన తరువాత ఇస్లామీయ చట్టాలన్నీ అతడికి పాటించవలసి ఉంటుంది. ఏ ఒక్క చట్టాన్ని లేదా చట్టంలోని ఓ అంశాన్నయినా సరే పాటించడానికి అయిష్టత చూపే అధికారం లేదు.

అమెరికాలో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి, ప్రచార, ప్రసార సాధనాలను విరివిగా ఉపయోగించి కూడా ప్రభుత్వం మద్యనిషేధానికి చేసిన తీవ్ర ప్రయత్నాలు వ్యర్థమవ్వడానికి కారణం ఇప్పుడు స్పష్టమయింది కదా! కాగా, అదే పని ఇస్లామీయ ప్రపంచంలో ఇస్లామ్ ప్రవక్త (స) చేసిన ఒక్క ప్రకటనతో సునాయాసంగా జరిగిపోయింది.

మూడో ముఖ్యమైన మాట ఏమంటే, వైజ్ఞానిక, సాంకేతిక రంగాల్లో ఎంతటి ప్రగతి సాధించినవారయినా సరే, ప్రగతి వికాసాల శిఖరాలను చేరుకున్నవారయినాసరే దైవాదేశాలకు అనుగుణంగా నడిచేవారు కానట్ల యితే, దైవ విశ్వాసం వారిలో లేకుంటే అలాంటి వారు మనోకాంక్షల మాయ

నుంచి బయటపడలేరు. అలాంటివారిలో మనోకాంక్షలు ప్రబలంగా వ్రేళ్ళూనుకుంటాయి. అవి ఎంత ప్రబలంగా ఉంటాయంటే అలాంటివారి మనసు ఏదైనా వస్తువును కోరితే ఆ వస్తువు వల్ల ఎన్ని నష్టాలున్నప్పటికీ, ఆ నష్టాలను శాస్త్రబద్ధంగా, హేతుబద్ధంగా వారి ముందు నిరూపించినప్పటికీ, ఆ వస్తువు వల్ల వాటిల్లే నష్టాల గురించిన సంఘటనలను ఏకరువు పెట్టినప్పటికీ- ఎన్ని చేసినప్పటికీ వాళ్ళు తమ మనోకాంక్షల దాస్యాన్ని మానరు.

దీనివల్ల తేలేదేమంటే, మనిషిలో నైతికతను ప్రేరేపించేది, మనిషి అంతరాత్మను జాగరూకం చేసేది, మనోకాంక్షలను అణచివేసే శక్తినిచ్చేది కేవలం దైవ విశ్వాసమే తప్ప మరొకటి లేదు.

-తర్జుమానుల్ ఖుర్ఆన్, జనవరి 1934.

# ఇస్లాం - మద్యనిషేధం

అధ్యక్ష మహాశయా! సభకు విచ్చేసిన మహా జనులారా! ఈ సెమినార్ కోసం నిర్ణయించిన అంశం వెనుక ఉన్న ఉద్దేశ్యం, లక్ష్యం ఒక్కటే కాగలదు: అది, మద్యనిషేధాన్ని విజయవంతం చేయడానికిగాను దేశంలోని ధార్మిక, సామాజిక సంస్థలకు వాటి బాధ్యతలను గుర్తు చేయడం. ఆయా సంస్థల బాధ్యతల్లో ఈ మద్యనిషేధం కూడా ఉందా? లేదా? అన్న అంశం చర్చ నీయాంశం కారాదు. ఎందుకంటే నా ఉద్దేశ్యం ప్రకారం ఈ అంశం ఆయా సంస్థల బాధ్యతల్లో ఓ బాధ్యత మాత్రమే కాదు. ఇది ఆ సంస్థల బాధ్యతల్లో అతి ముఖ్యమయిన బాధ్యత. నా దృష్టిలో, పేరుకు మాత్రమే మతం అనబడేదేదైనా, మనిషిని మానవతా స్థాయి నుంచి క్రిందికి త్రోసివేసే వస్తువులను, అనేక నైతిక రుగ్మతలకు ఆలవాలమయిన వస్తువులను గర్హనీయమని భావించకుండా ఉండదు, ప్రజలను దానికి దూరంగా ఉంచేందుకు చర్యలు తీసుకోకుండా ఉండదు.

అదే విధంగా సంఘ సంక్షేమం, సమాజ సంస్కరణల పట్ల ఆసక్తి కలిగి ఉన్న సంస్థలు, తమ ప్రోగ్రాముల్లో ఈ సామాజిక రుగ్మతకు తగు ప్రాధాన్యాన్ని ఇవ్వకపోతే, ఆ సంస్థలను కేవలం నామమాత్రమయిన సంఘ సంక్షేమ సంస్థలుగా భావించక తప్పదు.

అనేక మతాలకు, మత సంస్థలకు సంబంధించిన పెద్దలు ఈ సెమినార్‌లో పాల్గొంటున్నారు. ఈ సమస్యలో తమ తమ మతాల దృక్పథాన్ని వారే స్వయంగా వివరిస్తారు. అలా వివరించే హక్కు కూడా వారికే ఉంది. కాని, అనుసరించే మహాభాగ్యం నాకు ప్రాప్తమయిన ఇస్లామ్ ధర్మానికి సంబంధించినంత వరకు ఈ సామాజిక రుగ్మత పట్ల దాని దృక్పథమేమిటో విశదంగా అందరికీ విదితమే. చదువుకున్న వ్యక్తులున్న ఈ సమావేశంలో దాన్ని పెద్దగా వివరించవలసిన అవసరం లేదనుకుంటాను.

## మద్యం - ఖుర్ఆన్

ఇస్లాం ధార్మిక గ్రంథం ఖుర్ఆన్ మద్యాన్ని నిర్ద్వంద్వంగా హరామ్ (నిషిద్ధ వస్తువు)గా, అపవిత్రమయినదిగా పేర్కొంది. దైవం పట్ల నమ్మకమున్న

వారు మద్యానికి దూరంగా ఉండటం ఎంత అవసరమో స్పష్టం చేయడానికి గాను ఖుర్ఆన్ ముస్లిమ్‌లను, విశ్వసించిన ప్రజలారా! అని సంబోధిస్తూ మద్యానికి దూరంగా ఉండమని తాకీదు చేసింది. అలా మద్యానికి దూరంగా ఉండటమే మోక్షానికి, సాఫల్యానికి మార్గంగా నొక్కి వక్కాణించింది:

"విశ్వసించిన ప్రజలారా! సారాయి, జూదం, (దైవేతర శక్తుల) ఆరాధనా లయాలు; పాచికల ద్వారా జోస్యం- ఇవన్నీ అసహ్యాకరమయిన షైతానీ పనులు. వాటిని విసర్జించండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే అవకాశం ఉంది." (అల్ మాయిద: 90)

ఆ తరువాత మద్యం, జూదం ఈ రెంటి చెడుగులను గురించి ఖుర్ఆన్ ఇలా హెచ్చరించింది:

"షైతానయితే సారాయి, జూదాల ద్వారా, మీ మధ్య విరోధం, విద్వేషా లను సృష్టించాలని, మిమ్మల్ని అల్లాహ్ ధ్యానం నుంచి, నమాజ్ నుంచి వారించాలని కోర్తాడు. కనుక మీరు వీటిని మానుకుంటారా లేదా?" (అల్ మాయిద : 91)

ఈ రుగ్మతలకు దూరంగా ఉండటం, అల్లాహ్, ఆయన ప్రవక్త (స)ల విధేయత పాటించగోరేవారికి అత్యంతావశ్యకం అని పేర్కొంటూ, హెచ్చ రిస్తున్న ధోరణిలో ఖుర్ఆన్ ఇలా అంటున్నది:

"అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త మాట వినండి. దీన్ని మానుకోండి. కాని మీరు ఆజ్ఞల్ని పాటించకపోతే (మీ ఇష్టం), మా ప్రవక్త బాధ్యత అయితే ఆజ్ఞల్ని స్పష్టంగా అందజేయడమే." (అల్ మాయిద: 92)

ఈ ఖుర్ఆన్ వాక్యాల్లో 'ఖమర్' అన్న పదం వాడబడింది. ఈ పదాన్ని కాస్త గమనించడం అవసరం. 'ఖమర్' అరబీ పదం. ఈ పదానికి అర్థం- మనిషి బుద్ధిపై తెరవేసే వస్తువు అని. రెండవ ఖలీఫా అయిన హజ్రత్ ఉమర్ (రజి) ఓ ప్రసంగంలో ఈ పదాన్ని ఇలా నిర్వచించారు:

"బుద్ధిని కప్పిపుచ్చే వస్తువును 'ఖమర్' అనంటారు."

ఈ మాటల వల్ల మద్యానికీ, బుద్ధివివేకాలకూ గల సంబంధం స్పష్ట మవ్వడమేకాక, ఇస్లామ్ ఏదో ప్రత్యేక సారాయిని మాత్రమే నిషేధించలేదని,

నిషానిచ్చే ప్రతి వస్తువు, మనిషి ఆలోచనా సామర్థ్యాన్ని దెబ్బతీసే ప్రతి వస్తువు ఇస్లామ్ విధించిన నిషేధ పరిధిలోకి వస్తుందని తెలుస్తుంది.

ఈ సందర్భంగా, ఓ ముఖ్యమైన మాట దృష్టినందుండటం అవసరం. మనిషికి భూమిపై ఉన్న ప్రాణికోటిలో ఉన్నత స్థానాన్నిచ్చిన విషయం, వాస్తవానికి మనిషిలో ఉన్న ఆలోచనా సామర్థ్యం, మంచి చెడుల విచక్షణా జ్ఞానం. అందువల్ల మనిషి ఆలోచనా శక్తిని, బుద్ధివివేకాలను నష్టపరిచే వస్తువు లేదా మనిషి తన బుద్ధిబలాన్ని పూర్తిగా వినియోగించడంలో అవాంతరంగా పరిణమించే వస్తువు మనిషికి ప్రాణ శత్రువు వంటిదని నిస్సందేహంగా చెప్పవచ్చు. మద్యం మనిషి మస్తిష్కాన్ని మామూలుగా పనిచేయనీయదు. మంచి చెడ్డల విచక్షణా జ్ఞానాన్ని నశింపజేస్తుంది. మనిషిని మానవ స్థాయి నుంచి క్రిందకు పడవేస్తుంది. అందువల్ల మద్యం మనిషికి గర్భశత్రువు అనడం సముచితం, సమంజసం, సహజం కూడా.

## మద్యం - ఇస్లామ్ ప్రవక్త (స)

పవిత్ర ఖుర్‌ఆన్‌లో మద్యం గురించి ప్రస్తావించబడిన విషయాల వివరణ మనకు ప్రవక్త ముహమ్మద్ (స) ప్రవచనాల్లో అనేక చోట్ల కాన వస్తుంది. ప్రవక్త మహనీయులు (స) ఓ హదీసులో ఇలా సెల విచ్చారు: "నిషానిచ్చే ప్రతి వస్తువు ఖమర్. నిషానిచ్చే ప్రతి వస్తువు హరామ్ (నిషిద్ధం)." మహాప్రవక్త (స) ఇంకా ఇలా అన్నారు: "నిషానిచ్చే ప్రతి పానీయం హరామ్ (నిషిద్ధం). నిషానిచ్చే ప్రతి వస్తువు నుండి వారిస్తున్నాను."

సారాయిని ఇస్లామ్ ఎలా పరిగణిస్తుందో మరో హదీసు ద్వారా కూడా ద్యోతకమవుతుంది: "మద్యంపై, మద్యం త్రాగేవారిపై, త్రాగించేవారిపై, మద్యాన్ని అమ్మేవారిపై, కొనేవారిపై, తయారు చేసేవారిపై, మోసుకొని వెళ్ళేవారిపై, ఇంకా ఎవరి కోసమయితే మద్యం వెళ్ళుతుందో ఆ వ్యక్తిపై దేవుడు అభిశపిస్తున్నాడు" అని అన్నారు.

మద్యం విషయలో ఇస్లామ్ ఎంత తీవ్రంగా విరోధిస్తుందంటే, ఓసారి ఓ వ్యక్తి ప్రవక్త (స)తో దాన్ని ఔషధంగా వాడే అనుమతి ఉందా అని తెలుసుకో గోరాడు. అప్పుడు ఆయన (స), "మద్యం ఔషధం కాదు, వ్యాధి" అని తీవ్రంగా ఖండించారు.

'హామిర్' అనే ప్రదేశంలో ఉండే ఓ అనుచరుడు (ర) ఇలా ఉల్లేఖించారు: నేను ప్రవక్త ముహమ్మద్ (స)తో, "మేము చాలా శీతల ప్రాంతంలో ఉండేవాళ్ళం, పైగా చాలా శ్రమించి పనిచేసేవాళ్ళం. మేము ఓ విధమైన మద్యాన్ని తయారు చేస్తాం. అది త్రాగి చలిని, అలసటను తట్టుకుంటాం" అని అన్నాను. అప్పుడు ప్రవక్త (స), "మీరు త్రాగే వస్తువు నిషా నిస్తుందా?" అనడిగారు. దానికి నేను, "అవును" అని బదులిచ్చాను. అప్పుడు ప్రవక్త (స), "అయితే దాన్ని విడిచిపెట్టండి" అన్నారు. "మా ప్రాంతం (ముస్లిమ్) ప్రజలు ఒప్పుకోరు" అని అన్నాన్నేను. దానికి ప్రవక్త (స), "వారు ఒప్పుకోకపోతే వారితో ఈ విషయంలో పోరాడండి" అన్నారు.

మద్యానికి సంబంధించినంతవరకు ఇస్లామ్ నియమాల్లో మరొకటి ఏమంటే, నిషానిచ్చే వస్తువును అత్యల్ప మోతాదులో కూడా పుచ్చుకునే అనుమతి లేదు. మానవ ప్రవృత్తిని దృష్టిలో ఉంచుకుంటే, ఇది చాలా వివేకవంతమైన విషయం అని తెలుస్తుంది. ఎందుకంటే, మనిషి ఓసారి మద్యం రుచిమరిగితే విడిచిపెట్టడం కష్టం. మద్యం విషయంలో హద్దులు నిర్ణయించడం కూడా కష్టమే. ఎందుకంటే, ఈ హద్దుల్ని మనిషిలో ఉన్న బుద్ధి నిర్ణయిస్తుంది. కాని త్రాగిన తరువాత మద్యం మనిషిలోని బుద్ధిని మ్రింగేస్తుంది. బుద్ధి నిర్ణయించిన హద్దుల్ని మద్యం రద్దుచేస్తుంది.

మహాప్రవక్త ముహమ్మద్ (స) ఇలా సెలవిచ్చారు: "అత్యధిక మోతాదులో తీసుకుంటేనే నిషానిచ్చే వస్తువును అత్యల్ప మోతాదులో తీసుకోవడం కూడా హరామే."

ఇస్లామీయ సమాజంలో మద్యనిషేధం ఎలా అమలయిందన్నది వివరించడం ఇక్కడ సందర్భోచితం అనుకుంటాను. మద్యనిషేధానికి సంబంధించి జరుగుతున్న తీవ్ర ప్రయత్నాలకు ఈ సంఘటనలు మార్గం చూపగలవని నా విశ్వాసం.

## ఇస్లామీయ ఆదేశాల పరిణామక్రమం

మహనీయ ముహమ్మద్ (స) ప్రవక్తగా ఆవిర్భవించక పూర్వం అరబ్బు సమాజం నైతికంగా ఎంతో దిగజారిపోయింది. భోగవిలాసాల సామగ్రి ఎల్లెడలా లభ్యమయ్యేది. స్వేచ్ఛగా మద్యాన్ని సేవించడం సర్వసాధారణ మయి

పోయింది. ఇస్లామ్, ప్రజల మధ్య పవిత్ర జీవిత భావనను ప్రవేశపెట్టింది, విస్తృతపరిచింది. ఇస్లామీయ బోధనల వల్ల ప్రభావితులయినవారి మనస్సుల్లో ప్రారంభంలోనే మద్యం, జూదం లాంటి సామాజిక రుగ్మతల పట్ల అనేక ప్రశ్నలు తలెత్తసాగాయి. ఆ ప్రశ్నలకు సమాధానంగా పవిత్ర ఖుర్ఆన్ ఇలా పేర్కొంది:

> "మద్యపానం మరియు జూదాన్ని గురించి ప్రజలు నిన్ను ప్రశ్నిస్తున్నారు. నీవు వారికి ఉపదేశించు: ఈ రెంటిలోనూ ఎంతో కీడు ఉంది. వాటిలో ప్రజలకు కొన్ని లాభాలు ఉన్నా, ఈ లాభాల కంటే కలిగే కీడే ఎక్కువ." (అల్ బఖర : 219)

ఇది మద్యం, జూదాలకు సంబంధించిన ప్రథమ ఇస్లామీయ ఆదేశం. ఇందులో కేవలం అయిష్టాన్ని ప్రకటించి వదలివేయడం జరిగింది. తద్వారా ప్రజలు మద్యనిషేధానికి మానసికంగా తయారయ్యే వాతావరణం ఏర్పడింది. చాలా మంది ముస్లిములు ఈ ప్రాథమిక ఆదేశం వచ్చిన వెంటనే మద్యాన్ని విసర్జించారు. కాని, స్పష్టమయిన ఆదేశం ఇంకా రానందున చాలా మంది మద్యాన్ని వాడుతూనే ఉండేవారు. కొన్ని కొన్నిసార్లు మాత్రం మద్యం నిషాలోనే కొంతమంది నమాజుకై వచ్చేవారు. ఒకదానికొకటి చదివేసేవారు. అందువల్ల కొన్ని రోజుల తరువాత ద్వితీయ ఆదేశం వచ్చింది:

> "విశ్వసించిన ప్రజలారా! మీరు నిషా స్థితిలో ఉన్నప్పుడు నమాజ్ దరిదాపులకు పోకండి. మీరు పలికేదేమిటో మీకు తెలిసినప్పుడే నమాజ్ చెయ్యాలి." (నిసా : 43)

ఈ ఆదేశం ప్రభావం వల్ల ప్రజలు మద్యం త్రాగే వేళలను మార్చుకున్నారు. నమాజు సమయాల్లో నిషాలో తూగకుండా జాగ్రత్తపడ్డారు. ఇలా కొంత కాలం తరువాత మద్యాన్ని నిషేధిస్తూ స్పష్టమయిన ఆదేశం (ప్రారంభంలో పేర్కొన్న ఆదేశం) వచ్చింది. ఈ ఆదేశంపై అమలుజరిగిన తీరే అనన్యమయింది. మదీనాలో ఉన్న మద్యమంతా వీధుల్లో కాలువల్లా ప్రవహించింది!

పైన ఉదాహరించిన ఆయత్‌లలో మద్యం, జూదాలలోని లాభం గురించి ప్రస్తావించడం జరిగింది. దాన్ని కాస్త వివరించడం అవసరమను

కుంటాను. లాభం అంటే వైద్యపరమైన, భౌతికమైన లాభం అని మాత్రమే అర్థం కాదు. మరొకటి ఉంది. దాని గురించి తెలుసుకోవాలంటే, ఆనాటి అరబ్బు సమాజం గురించి కొద్దిగా వివరించాలి. ధనవంతులు, దాతృగుణం గలవారు త్రాగిన మత్తులో కనిపించిన ఒంటెను జిబహ్ చేసేవారు. ఆ ఒంటె యజమాని అడిగినంత మొత్తాన్ని ఇచ్చేసేవారు. ఆ ఒంటె మాంసంతో జూద మాడేవారు. ఆ జూదంలో ఎక్కువగా ఒంటె మాంసాన్ని గెలుచుకున్నవాడు ఆ మాంసాన్ని నిరుపేదలకు, అగత్యపరులకూ పంచేసేవాడు. బీదాబిక్కి అంతా విషయం తెలిసి ముందే అక్కడ ప్రోగయ్యేవారు. అంటే ఓ రకంగా మద్యం, జూదాలు అప్పట్లో సంఘసేవా కార్యక్రమాలకు ప్రేరణలుగా ఉండేవని చెప్పవచ్చు. అందువల్ల నిరుపేదలను ఆదుకోవాలని ఖుర్ఆన్ ఆయత్‌లు అవతరించినప్పుడు ప్రజలలో ఓ ప్రశ్న తలెత్తింది. ఇస్లామ్ నిరుపేదల కోసం ఖర్చుచేయమని ఇంత గట్టిగా చెబుతున్నప్పుడు మద్యం, జూదాలలో ఉన్న దోషమేమిటి? వాటివల్ల పేదవారికి ఓ విధమైన సహాయమే లభిస్తుంది కదా? అని అనుకోసాగారు.

ఈ ప్రశ్నకు జవాబుగానే పై ఆయత్ అవతరించింది. నైతికంగా మద్యం, జూదాలు హానికరమైనవని స్పష్టం చేయడం జరిగింది. వాటివల్ల ఏదైనా లాభం కనబడుతున్నప్పటికీ వాటి వల్ల కలిగే హాని కారణంగా వాటికి దూరంగా ఉండటం అవసరం అని నొక్కిచెప్పడం జరిగింది.

## మద్యనిషేధం - జమాఅతె ఇస్లామీ హింద్

మహా జనులారా! మద్యపానానికి సంబంధించిన ఇస్లామీయ బోధనల వెలుగులో ఓ విషయం స్పష్టంగా తెలుసుకోవచ్చు. జమాఅతె ఇస్లామీ హింద్, ఇస్లామ్ పేరుతో, ఇస్లామ్ వ్యాప్తికై, ప్రచారానికై ఇస్లామీయ బోధనలను, హితోపదేశాలను సాధ్యమైనంత వరకు అమలుపరచడానికై ఏర్పడి కృషి చేస్తున్న సంస్థ. దేశంలో మద్యనిషేధం పట్ల జమాఅత్ దృక్పథం ఏమై ఉంటుందని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. మరో విషయాన్ని మనం దృష్టిలో ఉంచుకోవాలి. ఇస్లామ్ ప్రకారం మంచిని పెంచడం, చెడును త్రుంచడం అన్నది ప్రతి ముస్లిమ్ నిర్వర్తించవలసిన నిజ కర్తవ్యం, ముస్లిముల మౌలిక బాధ్యత. అందుకు పవిత్ర ఖుర్ఆన్ ముస్లిములను సంబోధిస్తూ-

"ఇక నుండి ప్రపంచంలో మానవుల మార్గదర్శకత్వానికి, సంస్కరణకు రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యమని ఆజ్ఞాపిస్తారు. చెడు నుంచి ఆపుతారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు." (ఆలి ఇమ్రాన్ : 110)

అందువల్ల ముస్లిములుగా మేము చెడులన్నింటిలోనూ అతి పెద్ద చెడును, పాపజననిగా ఎంచబడేదాన్ని ఉపేక్షించినట్లయితే, మేము మా అతి ముఖ్యమైన కర్తవ్యాన్ని విస్మరించామన్న మాట. కాబట్టి ఈ సామాజిక రుగ్మత నుంచి జనసామాన్యాన్ని కాపాడడానికి మా వంతు పాత్రను నిర్వహించడంలో వెనుదీయరాదని భావిస్తాం.

తదనుగుణంగానే కేవలం ముస్లిములకు మాత్రమే అని కాదు, దేశ ప్రజలందరి సంక్షేమానికిగాను ఉద్దేశించిన మా కార్యక్రమాల్లో మద్యం, జూదాల వంటి అనేక చెడుల నుంచి సమాజాన్ని కాపాడే ప్రయత్నాలకు ప్రత్యేక ప్రాధాన్యత ఇచ్చాము.

జమాఅత్ శాఖలున్న ప్రతి ప్రాంతంలోనూ, జమాఅత్ కార్యకర్తలున్న ప్రతీ చోటా ఈ చెడుల నిరోధం పట్ల తగు కృషి జరుగుతూంది. బహుశా మీలో కొందరికి ఈ విషయం తెలిసే ఉంటుంది. 1982 డిసెంబర్‌లో జమాఅతె ఇస్లామీ హింద్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాఖ పూర్తి రాష్ట్రంలో "చెడుల నిరోధక సప్తాహం" నిర్వహించింది. ఈ సప్తాహం సందర్భంగా అనేక చోట్ల సమావేశాలు, సెమినార్లు, సింపోజియాలు ఏర్పాటు చేయడం జరిగింది. చాలా ప్రాంతాల్లో విద్యార్థులు, యువకులు ఊరేగింపులను కూడా తీశారు. ఈ కార్యక్రమాలన్నింటిలోనూ ముస్లిములతోపాటు ముస్లిమేతర సోదరులు కూడా అత్యుత్సాహంతో పాల్గొన్నారు. చాలా ప్రాంతాల్లో అనేక మంది ప్రముఖ ముస్లిమేతర మేధావులు ఈ సెమినార్లలో, సింపోజియాలలో పాలుపంచుకున్నారు. పూర్తి రాష్ట్రంలో ఈ సప్తాహ కార్యక్రమాలు మంచి ప్రభావాన్ని వేశాయి. వార్తాపత్రికలు కూడా దాని వార్తలకు మంచి కవరేజినిచ్చాయి. కొన్ని ప్రాంతాల్లో బహిరంగ సభల్లో మద్యపానానికి అలవాటుపడిన కొందరు ముస్లిమేతర సోదరులు ఇక నుంచి మద్యానికి పూర్తిగా దూరంగా ఉంటామని తమ నిర్ణయాన్ని తెలియజేశారు.

ఈ ప్రయత్నాలను మేము మాకుగా ప్రారంభించడంతోపాటు ఈ పనిలో ఇంతకుముందు నుంచి కృషి చేస్తూ, మా సహాయాన్ని కోరుతున్నవారికి మేము చాలా సంతోషంతో తోడ్పాటును అందిస్తున్నాం.

మరో విషయం మీ దృష్టిలోకి తేవాలనుకుంటున్నాను. 1970 జనవరిలో మద్యనిషేధానికి "గాంధీ శతజయంతి అంతర్జాతీయ సమావేశం" జరిగినప్పుడు అందులో పాల్గొనవలసిందిగా నన్ను కూడా పిలిచారు. ఆ సందర్భంలో నేను, "మతం, నైతికత మరియు మద్యం" (Religion, Morality and Alcohol) అన్న అంశంపై ఓ పత్రాన్ని ఇంగ్లీషులో సమర్పించాను. అది కాన్ఫరెన్సు తరపున ముందే ప్రచురించి సమావేశంలో పంచారు.

గాంధీజీ పేరును అత్యంత మర్యాదపూర్వకంగా పలకడం, గాంధీజీ సమాధిపై పుష్పగుచ్ఛాలుంచడం, గాంధీజీ జయంతి ఉత్సవాలు నిర్వహించడంలో మన చిన్నా పెద్ద నాయకులు అత్యుత్సాహంతో ఒకరిని మించి మరొకరు పోటీపడుతూ మరీ పాల్గొంటారు. కాని, ఆ మహోన్నత భారత పుత్రుని పట్ల నిజమయిన ప్రేమ, సంబంధ బాంధవ్యాల విషయంలో మటుకు వారు అత్యంత అలక్ష్యం చూపుతున్నారని చెప్పడానికి నేను చాలా చింతిస్తున్నాను. గాంధీజీ పేరు జపించినంత మాత్రాన గాంధీజీని ప్రేమించి, గౌరవించినట్లు కాదు. ఆ మహనీయుని జీవితం నుంచి మంచి పాఠాన్ని గ్రహించడం, ఆయన మంచి మాటల్ని పాటించడంలో మాత్రమే నిజమైన గౌరవాదరణలు ఇమిడి ఉన్నాయి. గాంధీజీ తన కార్యక్రమాల్లో మద్యనిషేధానికి ఎంత ప్రాధాన్యత ఇచ్చారో ప్రపంచానికి తెలుసు. మద్యనిషేధం కోసం ఆయన జీవితంలో ఎంత తీవ్ర కృషి జరిపారో కూడా తెలుసు. గాంధీజీ అనుంగు అనుచరులయిన గుజరాత్ మాజీ గవర్నర్ శ్రీ శ్రీమన్నారాయణ గారిని కలుసుకునే అవకాశం నాకూ అనేకసార్లు లభించింది. ఈయన ఓ వ్యాసంలో గాంధీజీ మాటల్ని ఇలా ఉటంకించారు.

"నన్ను గనుక భారత దేశానికి నియంతగా- కనీసం ఒక్క గంట కోసమైనా- నియమిస్తే నేను ప్రప్రథమంగా, సారాయి దుకాణాలన్నింటినీ ఎలాంటి నష్టపరిహారం లేకుండా మూసేయాలని ఆదేశిస్తాను. సారాయి మెతకగా వ్యవహరించదగ్గ వస్తువు కాదు. సంపూర్ణ మద్యనిషేధం తప్ప మరే చర్య ప్రజల్ని ఈ రుగ్మత నుంచి కాపాడలేదు."

## మద్యనిషేధం విషయంలో కుంటిసాకులు

గాంధీజీ ఏమో మద్యాన్ని సామాజిక రుగ్మతగా, నష్టదాయినిగా భావించి ఈ రుగ్మత నుంచి ప్రజల్ని కాపాడడానికిగాను సంపూర్ణ మద్య నిషేధం ఒక్కటే మార్గమని, కడకు నష్టపరిహారం కూడా లేకుండా దుకాణాలను మూయించాలని చెప్పగా, నేడు గాంధీజీ పేరు చెప్పుకునే గాంధేయుల్లో మద్యనిషేధం ఆచరణ సాధ్యంకాదని, అది గాంధీజీ కన్న నిజం కాదని, ఓ సుందర స్వప్నం మాత్రమే అని అనుకునేవాళ్ళకు కొదువలేదు. కాంగ్రెస్ పార్టీ, కాంగ్రెస్ ప్రభుత్వాలు మొదట్లో ఈ విషయమై చాలా ఉత్సాహాన్ని ప్రదర్శించాయి. 1956 మార్చిలో లోక్‌సభ ఓ తీర్మానాన్ని ఆమోదిస్తూ, రెండవ పంచవర్ష ప్రణాళికలో మద్యనిషేధాన్ని తప్పనిసరి అంశంగా ప్రాధాన్యత నివ్వాలని, దేశమంతటా సంపూర్ణ మద్యనిషేధాన్ని అమలు చేయడానికిగాను ప్లానింగ్ కమిషన్ తగు ఫార్ములా రూపొందించాలని కోరింది.

ఆ సూచనపై అమలు కోసం ప్లానింగ్ కమిషన్ కొన్ని చర్యలు నిర్ణయించింది కూడా. కొన్ని రాష్ట్రాలు వాటిని ఆచరణలో పెట్టడానికిగాను కొన్ని చర్యలు కూడా తీసుకున్నాయి. కాని దురదృష్టమేమంటే, కాలంతోపాటు ఈ సమస్యపై పట్టుదల సడలిపోయింది. సామంజస్యత, వివేచనలన్న పేరుతో కొన్ని రాష్ట్రాలు మద్యనిషేధం చట్టాలను సడలించాయి. కొన్ని రాష్ట్రాలు మద్యనిషేధం వల్ల తగ్గే ఆదాయాన్ని భరింపరానిదిగా నిర్ణయించి ఈ చట్టాలను సడలించాయి. ప్రస్తుతం పరిస్థితి ఏమంటే, అనేక రాష్ట్రాల్లో ఈ విధంగా కేవలం ప్రదర్శనాబుద్ధితో, గాంధీజీ వారసులమని చెప్పు కునేందుకుగాను నామమాత్రంగా మద్యనిషేధంపై కుంటిసాకుల మధ్య అమలు జరుగుతోంది. ఫలితంగా సారా తెచ్చిన వినాశకర పరిణామాల వార్తలు రాని రోజంటూ లేని పరిస్థితి ఏర్పడింది. మద్యానికి అలవడ్డవారు కల్తీసారా త్రాగి తమ ప్రాణాల్ని ఎలాగూ పోగొట్టుకుంటున్నారు. కాని అమాయ కులు, మద్యాన్ని ముట్టనివారు సయితం అనేకమంది బస్సు డ్రైవర్లు, రైళ్ళ డ్రైవర్ల సారా నిషా కారణంగా మృత్యువుపాలుకావడం లేదూ! స్వయాన రైల్వే మంత్రి మాటల ప్రకారం, అనుదినం జరుగుతున్న రైలు దుర్ఘటనలకు ప్రముఖ కారణం మద్యపానమని తెలుస్తుంది. అది మనిషి వ్యక్తిగత స్వేచ్ఛ అని, మద్యనిషేధాన్ని వ్యతిరేకించడం వివేకవంతం కాదు. అలా అనుకుంటే,

ఇక కొంత కాలానికి దొంగతనాలు, లూటీలను అరికట్టడం కూడా న్యాయం కాదన్న వాదన పుడుతుంది. మద్యప్రియులు మద్యం ప్రేమలో అంధులై ఇలాంటి వాదనలు చేస్తే- ప్రేమ మనిషిని గుడ్డివాడిని చేస్తుందని వారిని క్షమించవచ్చు. ఎందుకంటే, మనిషి బుద్ధివివేకాలపై తెర వెయ్యడమే మద్యం పని. కాని ఈ దుర్వ్యసనానికి దూరంగా ఉన్న మేధావుల వ్యక్తిగత స్వేచ్ఛ పేరు మీద మద్యనిషేధాన్ని వ్యతిరేకించడం ఆశ్చర్యకరం. ఏ లక్ష్యం కొరకు స్వేచ్ఛ కావాలని వాదిస్తారో, ఆ అసలు లక్ష్యాన్నే ధ్వంసం చేసే ఈ స్వేచ్ఛ ఎలాంటిదో మరి? ఇకపోతే, మద్యనిషేధం వల్ల ప్రభుత్వ ఖజానాకు వచ్చే నష్టం విషయానికి వస్తే ఈ కారణాన్ని చూపి మద్యనిషేధాన్ని వ్యతిరే కించడం మరింత శోచనీయం. ప్రభుత్వాలకు ప్రజల బుద్ధివివేకాల బాగోగుల కన్నా ఆదాయం అంత ముఖ్యం కారాదు. మనిషి బుద్ధివివేకాలపైనే అతని ధన ప్రాణాలకు, మానమర్యాదలకు రక్షణ ప్రాప్తమవడంతోపాటు ఇతరుల ధన, ప్రాణ, మానమర్యాదలకు కూడా రక్షణ ప్రాప్తించడం ఆధారపడి ఉంది.

హజ్రత్ అబూబకర్ (ర) అజ్ఞాన కాలంలోనూ మద్యాన్ని ముట్టలేదు. మద్యాన్ని అప్పుడు ఎందుకు త్రాగేవారుకాదని ఆయన్ని అడిగితే, "నేను నా మానమర్యాదల రక్షణ కోసం అలా చేసేవాడిని. ఎందుకంటే మద్యం త్రాగే వాడు తన మానమర్యాదలను నిలబెట్టుకోలేడు" అని జవాబిచ్చారు. ఈ విషయం మహనీయ ముహమ్మద్ ప్రవక్త (స)కు తెలిసినప్పుడు ఆయన "అబూ బకర్ నిజం పలికారు, అబూ బకర్ నిజం పలికారు" అని అన్నారు.

మద్యనిషేధం వల్ల ప్రభుత్వాలకు వాటిల్లే ఆర్థిక నష్టం, దానివల్ల కలిగే నైతిక లాభాల ముందు ఏమంత చెప్పుకోదగ్గది కాదు. పైగా, మద్యాన్ని త్రాగేవాళ్ళు నిషేధం వల్ల మద్యంకై పెట్టే ఖర్చును తమ కుటుంబ సభ్యుల అవసరాల నిమిత్తం ఖర్చు చేస్తారు. వారి పనిసామర్థ్యం పెరుగుతుంది. ఉత్పాదన అధికమవుతుంది. అందువల్ల దేశానికి లాభం చేకూరుతుంది. ఫలితంగా ప్రభుత్వ ఖజానాకు రాబడి పెరుగుతుంది.

## ఇతర దేశాలలో...

ఇటీవల ఓ విదేశీ పత్రికలో ఓ వ్యాసాన్ని చదివాను. అందులో రష్యా లోని ప్రముఖ మద్యం 'ఓడ్కా' గురించి స్వయాన రష్యా పరిశోధకులను ఉటంకిస్తూ, ఈ మద్యం వల్ల సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి కుంటుపడు

తుందని వ్రాశారు. అందులో ఇంకా ఇలా ఉంది: నేడు ప్రభుత్వానికి ఇదొక తలనొప్పిగా పరిణమించింది. పనిని ఎగ్గొట్టేందుకుగాను జబ్బు సాకుతో సెలవులు పెట్టే కార్మికుల సంఖ్య ప్రతి వారం పెరుగుతూ పోతుంది. రష్యా పరిశోధకులు పరిశోధనలు, చర్చలు జరిపిన తరువాత ఓ నిర్ణయానికి వచ్చారు. కార్మికులలో పని ఎగ్గొట్టే వైఖరి పెరగడానికి గల పది కారణాల్లో తొమ్మిది కారణాలు సారాయి త్రాగడమేనని వారు తేల్చారు. కొద్ది కాలం క్రితం అక్కడి ఓ ప్రముఖ సాంఘిక శాస్త్రవేత్త తన పరిశోధనా ఫలితాలను తెలుపుతూ, రష్యాలోని శ్రామికులు 'ఓడ్కా' అలవాటును మానేస్తే ఉత్పత్తిలో పది శాతం పెరుగుదల ఉంటుందని అభిప్రాయపడ్డారు. ఆ వ్యాసంలో సైబీరియాలో, ఓ నగరంలోని అధికారుల అభిప్రాయాలను గురించి కూడా ఇలా ఉంది: మద్యం త్రాగే శ్రామికులు సెలవులు పెడుతున్నారు. అందువల్ల ఆ నగరానికి ఏటా రెండున్నర మిలియన్ డాలర్ల నష్టం కలుగుతుంది. ప్రతి వారం సోమవారం నాడు ఈ పరిస్థితి ఉంటుంది. శ్రామికుల గైర్హాజరు వల్ల మూడో వంతు ఉత్పత్తి తగ్గిపోతుంది. కర్మాగారాల్లో వాస్తవానికి పని మంగళవారం నాడు మొదలవుతుంది. శుక్రవారం నాటికి పూర్తవుతుంది. అంటే వారానికి కేవలం నాలుగు రోజులు మాత్రమే పని జరుగుతోందన్నమాట.

మరో వ్యాసంలో ఇంగ్లాండ్ పరిస్థితి గురించి ఓ భయానక వార్తను కూడా నేను చదివాను. ఓ స్కూలులోని 160 మంది విద్యార్థులు క్రిస్మస్ సందర్భంగా ఓ ఉత్సవాన్ని నిర్వహించారు. ఆ సందర్భంగా ఆ విద్యార్థుల మధ్య వేగంగా సారాయి త్రాగే పోటీ జరిగింది. ఆ తరువాత ఆ విద్యార్థులలో ఒకడు మరుగు దొడ్డిలో స్పృహ తప్పి కనిపించాడు. మరో అయిదుగురిని ఆసుపత్రికి తరలించవలసి వచ్చింది. ఆ ముదనష్టపు కార్యక్రమం జరిగి గంటన్నా కాలేదు, అనేకమందికి కాళ్ళూ చేతులు పడిపొయ్యాయి.

ఇలాంటి దురదృష్టకర సంఘటనలు విదేశాల్లో మాత్రమే జరగటం లేదు. మతాచారాలు, నైతిక మూల్యాలకు ఉన్నత స్థానం ఉన్న మన దేశంలోనూ, త్రాగుబోతులను అసహ్యించుకునే ఈ దేశంలోనూ ఇలాంటి సంఘటనలు పత్రికలు రోజూ చదివేవారికి తెలుస్తూనే ఉంటాయి. అలాగే ఎందుకు జరగదు మరి? మన దేశం అనుసరించేది కూడా పాశ్చాత్య దేశాలను- అదే ప్రగతి అన్న భ్రమలో కదా! అందువల్ల అక్కడి సంస్కృతి సభ్యతలకు ఎంత కాలమని దూరంగా ఉండగలుగుతుంది?

## అమెరికాలో మద్యనిషేధం

మద్యనిషేధాన్ని వ్యతిరేకించేవారు చేసే మరో వాదన ఉంది. ఈ శతాబ్దపు మూడవ శతాబ్దంలో అమెరికాలాంటి శక్తిమంతమయిన ప్రభుత్వం మద్యం చేసే హాని నుంచి దేశ ప్రజలను కాపాడడానికి మద్యనిషేధాన్ని చట్టబద్ధంగా అమలుచేయాలనుకుంది. కాని, సఫలీకృతం కాలేకపోయింది. చట్టాన్ని రద్దు చేయక తప్పలేదు. కాని ఈ వాదన నా ఉద్దేశ్యం ప్రకారం బలంలేని వాదన. ఆలోచించవలసిన విషయమేమంటే, అమెరికా చర్య వల్ల అసలు రుగ్మతకు చికిత్స జరిగిందా? లేక పరిస్థితి మరింత విష మించిందా? రష్యా, ఇంగ్లాండ్‌లలో మద్యం వల్ల జరిగిన వినాశనాల్ని ఇంతకు ముందే చెప్పాను. అమెరికాలో ఈ మద్యం మరింత తీవ్ర నష్టాల్ని కలుగ జేసింది. ఈ సమస్య అక్కడి సమాజ శ్రేయోభిలాషులను, మేధావులను తీవ్రంగా కలచివేస్తుంది. మద్యనిషేధాన్ని వ్యతిరేకించే వాళ్ళు మద్యం వల్ల వాటిల్లుతున్న ఈ వినాశనాన్ని చూసీచూడనట్లు వ్యవహరించడం, అమెరికన్లు వెనుకంజవేయడాన్ని తలచుకుంటూ మత్తుగాపడి ఊరుకోవడం ఉచితమా?

అమెరికా ప్రభుత్వం చాలా బలమైన ప్రభుత్వం. ఏ పనినయినా పూర్తిచేయడానికి అన్ని విధాలా అవసరమైన వనరులు, శక్తిసామర్థ్యాలు పుష్కలంగా గల ప్రభుత్వం. అయినా అది అలా వెనుకంజ ఎందుకు వేసిందీ అన్న విషయాన్ని పరిశీలించరాదు. ఎందుకంటే, ప్రథమంగా మద్యనిషేధాన్ని అమలుజరపడానికి కావలసిన సాధనాలు కూడా దానికి ప్రాప్తమై ఉన్నా యన్నదే చర్చనీయాంశం. అవే గనుక లేకపోతే అమెరికా వద్ద సమృద్ధంగా ఉన్న ఇతర వనరులు, శక్తిసామర్థ్యాలు అన్నీ వ్యర్థమే అవుతాయి. మద్య నిషేధాన్ని అమలుజరిపేందుకుగాను మొదట అలాంటి కృషి జరపడానికి తగిన వాతావరణాన్ని సృష్టించాలి. కాని, భౌతికవాదం ఆధారంగా ఏర్పడిన సంస్కృతికి అమెరికా ప్రపంచంలోనే ముఖ్య కేంద్రమని, అక్కడ మతం, నైతికత అన్నవి దాదాపు బహిష్కృతమై పోయాయని అందరికీ తెలుసు.

మద్యనిషేధం కోసం అమెరికా చేసిన ఆ చట్టాల గురించి నేను వివరంగా చదువలేదు. బహుశా ఆ చట్టాల్లోనే లోపాలుండటం వల్ల అవి విఫలం అయి ఉండవచ్చు. ఒకవేళ చట్టాలు లోపరహితమైనవనే అను

కున్నప్పటికీ, ఆ చట్టాలను అమలు చేసేవారిలో మద్యనిషేధం పట్ల ఆసక్తి, అభిరుచి ఉండనందువల్ల విఫలం అయివుండవచ్చు.

## ఇస్లాంలో సంస్కరణా విధానం

మద్యనిషేధం విషయంలో ఇస్లామ్ బోధనల గురించి చెబుతూ నేను ఓ మాటను సూచించాను. ప్రారంభంలో మద్యనిషేధానికి అవసరమైన తగు వాతావరణం ఎలా సృష్టించడం జరిగిందో, మానవ మనస్తత్వంలోని సకల బలహీనతలను దృష్టిలో ఉంచుకుని వాటి ద్వారాలను ఎలా మూయ గలిగిందో ఇంతకు ముందే చెప్పాను. ఉదాహరణకు, మత్తు పదార్థం అత్యల్పమైన మోతాదును కూడా హరామ్ (నిషిద్ధం)గా చేయడం జరిగింది. అలాగే మద్యాన్ని, మద్యం త్రాగేవారిని శపించినట్లే. మద్యాన్ని ఉత్పత్తి చేసేవాళ్ళను, ఎవరి కోసం ఉత్పత్తి అవుతుందో వాళ్ళను, అమ్మేవాళ్ళను, కొనేవాళ్ళను, త్రాపేవాళ్ళను, మద్యాన్ని ఓ చోటి నుంచి మరో చోటికి చేరవేసే వాళ్ళను, ఎవరి కోసం చేరవేస్తున్నారో వాళ్ళను- అందరినీ దైవాగ్రహానికి అర్హులుగా ప్రకటించడం జరిగింది.

మద్యం వల్ల వాటిల్లే నష్టాలను వివరించడంతో ఇస్లామ్ సరిపెట్టలేదు. దాంతోపాటు తీవ్ర శిక్షలను కూడా విధించింది. ఎనభై కొరడా దెబ్బలు లేదా కొందరు ధర్మవేత్తల ప్రకారం నలభై కొరడా దెబ్బలు నిర్ణయమయ్యాయి. షరీఅత్ ప్రకారం మద్యనిషేధాన్ని బలాన్నుపయోగించి అమలు చేయడం ఇస్లామియ ప్రభుత్వ బాధ్యత. అందువల్లనే ఇంతకుముందు చెప్పిన సంఘటనలో హమీర్ ప్రాంతానికి చెందిన ప్రజలు చలి నుండి రక్షణకు, అలసట తీర్చుకోడానికి త్రాగే మద్యాన్ని వదలిపెట్టడానికి ఇష్టపడరని ఆ ప్రాంతం నుండి వచ్చిన ఓ సహచరుడు (ర) ప్రవక్త (స)తో చెప్పి నప్పుడు ఆయన స్పష్టంగా, ఖచ్చితంగా, "అయితే వారితో పోరాడండి" అని ఆదేశించారు. హజ్రత్ ఉమర్ (రజి) కాలంలో బనీ సఖీఫ్ తెగలోని ఓ వ్యక్తి దుకాణంలో దొంగతనంగా మద్యం అమ్ముతున్నందుకుగాను ఆ దుకాణాన్ని కాల్చివేశారు. మరో సందర్భంలో, ఓ ఊరి మొత్తాన దొంగ సారా ఉత్పత్తి, అమ్మకాలు జరుగుతున్నందున ఆ గ్రామాన్ని హజ్రత్ ఉమర్ (రజి) ఆదేశం మేరకు కాల్చి బూడిద చేశారు. అమెరికాలో మద్యనిషేధాన్ని అమలు పరిచేందుకు ఇలాంటి మాటల్ని ఎంతవరకు దృష్టిలో పెట్టుకున్నారన్నదే ప్రశ్న.

మద్యనిషేధం విషయంలో ఇలాంటి చట్టాలను పూర్తిగాగాని, పాక్షికంగాగాని ఉపేక్షించడం వల్లనే విఫలమై ఉంటాయా? అన్నదీ పరిశీలించవలసి ఉంటుంది.

ఆఖరున ఓ విషయం చెప్పి ముగించాలనుకుంటున్నాను. మనం, మన దేశంలో మద్యనిషేధాన్ని పూర్తిగా అమలు జరపాలని కోరుకుంటే, ఈ కోణాలన్నింటినీ దృష్టిలో ఉంచుకోవడం అవసరం. మద్యనిషేధం కొరకు మనకు కావలసిన ముఖ్యమైన మార్గం- ప్రజలలో దైవభీతి, దైవభక్తి, మరణానంతరం జవాబు చెప్పుకోవలసి ఉందన్న భావన, అక్కడ ప్రాప్తమయ్యే సాఫల్యమే నిజమయిన సాఫల్యమన్న భావనల్ని, ఆ ఉత్సాహాన్ని ప్రజల్లో పెంపొందించడం కూడా అవసరమే.

మద్యనిషేధంలో ఇస్లామ్ సాధించిన ఆదర్శనీయ విజయానికి పైన చెప్పిన మాటలకు, ముఖ్యంగా ఆఖరి మాటకు మౌలికమైన ప్రాధాన్యత ఉంది. కాలంతోపాటు ముస్లిమ్‌లలో ఇస్లామ్ పట్ల ఆచరణ బలహీనపడింది. అయినా, నేటికీ ముస్లిమ్ సమాజం చాలా వరకు మద్యానికి దూరంగానే ఉందంటే పై విషయాల కారణంగానే.

ఇక్కడ మరో విషయాన్ని ప్రస్తావించడం అనుచితం కాదను కుంటున్నాను.

ఖుర్‌ఆన్‌లో ముస్లిమ్‌లను ఉద్దేశిస్తూ- మీరీ విషయాలను మాను కుంటారా లేదా? అన్న ఆయత్ అవతరించినప్పుడు అన్ని వైపుల నుంచి, "ఓ ప్రభూ! మేము మానుకుంటాము, మేము మానుకుంటాము" అన్న నినాదాలు మారుమ్రోగిపోయాయి.

ఇస్లామ్‌లో ఈ దైవాజ్ఞాపాలనా భావమే మద్యనిషేధాన్ని సాధించ గలిగింది. భవిష్యత్తులోనూ ఈ భావన వల్లనే సంపూర్ణ మద్యనిషేధం సాధ్య పడుతుంది.

**-: సమాప్తం :-**